# గదాయుద్ధము

(రన్నని కన్నడ కృతి)

బి. యం. శ్రీకంఠయ్యగారిచే నాటకీకృతము

తెనుగుసేత

గడియారము రామకృష్ణశర్మ



సాహిత్య అకాడెమి

న్యూఢిల్లీ

GADAYUDDHAMU—Telugu translation by G Ramakrishna Sarma, of *GADAYUDDHA-NATAKAM*, a Kannada play by 'Sri' (B M. Srikantiah) based on the ancient classic of Poet Ranna. Sahitya Akademi, New Delhi, 1969. Price Rs 2 50



ప్రథమ ముద్రణ : 1969

Available at :
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1

Regional Office :
CALCUTTA-29

Regional Office :
MADRAS-6

ముద్రణ :

థాంప్సన్ & కో. ప్రైవేట్ లి.

(మినర్వా ప్రెస్)

33, బ్రాడ్వే, మద్రాసు-1

వెల : రూ. 2.50

# అనువాదకుని మాట

ఆంధ్రసాహిత్యమునకు కవిత్రయ మెట్టిదో కన్నడసాహిత్యమునకు రత్న త్రయ మట్టిది. ఆ మేలి రత్నములలోనివాడు రన్నమహాకవి. 'కవి-కావ్య ప్రశస్తి' లో నితని సమగ్రపరిచయ మొసగబడినది.

రన్నకవి నన్నయకు అర్ధశతాబ్దపు ముందున్నవాడు. అతని కృతిరత్నము లలో "గదాయుద్ధము" ఉత్తమజాతికి చెందినది. రన్నని రసప్రతిపాదనము, ఉదాత్తశైలి, పాత్రచిత్రణము, ఔచిత్యవివేకము, అన్యాదృశములైనవి. అతని మహాకావ్యమునకు సంక్షేపరూప మీ సంకలనము. 'హళెగన్నడము' లోని ఈ ప్రౌఢకావ్యము నాంధ్రీకరింప బూనుట సాహస మనకతప్పదు. ఇందేమైన సుగుణములున్న నవి రన్నమహాకవి వనియు, దోషము లన్నియు నావనియు విన్న వించికొనుచున్నాను.

కన్నడ ప్రొఫెసర్ శ్రీ డి. కె. భీమసేనరావుగారు అనురాగమున నీ అను వాదమును మూలముతో సరిజూచి విలువగల సూచన లొసగి తోడ్పడిరి. కుల వృద్ధులు, మహాకవి శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రులుగారు వాత్సల్యముతో ఆంధ్రీకరణమును పూర్తిగా విని సంస్కరించినారు. ఈ పూజ్యపాదులకు కృత జ్ఞతలు సమర్పించికొనుచున్నాను.

నా కీ అమూల్యావకాశమును కల్పించిన ఆప్తమిత్రులకును, కేంద్ర సాహిత్య అకాడెమీ వారికిని ఋణపడియున్నాను. ఈ ప్రయత్నము విబుధజనాదర ణము పొందగలిగిన కృతార్థుడ నయ్యెదను.

అలంపురము
పరాభవ-శ్రావణము

బుధవిధేయుడు
గడియారము రామకృష్ణశర్మ

# కవి—కావ్యప్రశస్తి

## మున్నుడి :

రన్నడు సరస్వతికి రన్నడు (రత్నము). అతనికి విసర్గకవితాధారతో పాటు ఉత్తమశిక్షణయు లభించినది. సంస్కృతమున, కన్నడమున చక్కని చిక్కని పాండిత్యమును సంపాదించెను. ఆకాలపు రాజోద్యోగుల, మహారాజుల ఆశ్రయము పొంది గణ్యుడై బిరుదములను ఒడసెను. తన ధార్మికగ్రంథమగు "అజిత పురాణము" నందును, లౌకికకావ్యమగు "సాహసభీమసేనవిజయము" (గదాయుద్ధము) నందును తన ప్రతిభామహత్వమును చాటినాడు. "పరశురామచరితె" అను తొలి రచన మనకు లభ్యము కాలేదు. ఈ మూడుగ్రంథములు "రత్నత్రయ" మని చెప్పికొన్నాడు. అజితపురాణమున స్వీయమతమగు జైనమును ప్రతిపాదించెను. ఇందు రన్నని కవితాశక్తికి సరియైన అవకాశము లభింపలేదు. విషయముకూడ ఆ మతాభిమానము లేనివారికి అంత రుచించునది కాదు. సాహసభీమసేనవిజయమునందు అందరికిని ఆదరపాత్రమైన మహత్వపూర్ణకథ, మహావీర నాయకులు. రసావిర్భావమున కనుకూలమైన సన్నివేశములు పంప, భట్టనారాయణ, బాస మహాకవుల ప్రేరణ ఒనగూడి రన్నవిప్రతిభ పొంగి ప్రవహించి కన్నడ కావ్యప్రపంచమునందే గణనీయకావ్యరత్నముగ వెలసియున్నది. ఇందలి నాటకసంవిధానము, దుర్యోధనపాత్రకల్పన, సమయోచితభావములు, రసప్రవాహము, శైలి అద్వితీయములై యున్నవి. మెప్పించుటకు సాధ్యముకాని యెంతవాడైనను యీకావ్యమునకు వెఱగొంది యింతటికవిని, యింతటికావ్యమును పడయగల్గిన కన్నడము ధన్యమని చెప్పక యుండలేదు. "రన్నని కృతిరత్నమును పరీక్షించువాని కెన్ని గుండెలుండవలెను?" అన్న కవి హెచ్చరిక కేవలాహంభావపూరితవాక్యము కాదని యీ కావ్యము చెప్పును.

ఈ కాలపు పాఠకులకు ఎట్టి యుత్తమకవి గ్రంథములనైన కొద్దిగ పరీక్షించుట ఇష్టము. మనము బహూమానింపదగిన వ్యక్తి రన్నపండితుడు కాడు. రన్నశాస్త్రి కాడు. రన్నమహాకవి. సాహిత్యశాస్త్ర, ధర్మశాస్త్ర, మతసిద్ధాంతాదు

అన్నో కాలానుగుణముగ రుచి, శ్రద్ధ మారుచుండుట సహజము. ఒకరుచికి ఒకశ్రద్ధకు హితమైన విషయము మరొకరుచికి, శ్రద్ధకు హితము కాకపోవచ్చును. రన్ననిలోగూడ ఒకకాలమున సుందరమై మరొక కాలమున అంత సుందరము కాని అంశము లుండవచ్చును. విశ్వమునందలి మానవమాత్రుడైన యే కవిచక్రవర్తియందైనను కుందు, కొఱత లుండవవి, కళాసౌందర్యవిషయములలో తప్పు అంచనాలుండవని, తగిన సన్నివేశములన్నిటిలో కవితాశక్తి తన లక్ష్యమును సూటిగ అందుకొనెనని సాధింప బూనుట మూఢభక్తి యగును దీనివలన ప్రయోజనము శూన్యము. చివరకు నిలుచునది అభిమానముకాదు సత్యము.

అందువలన రన్నని పరీక్షింపుడు. రన్ననిగూడ విడువక విమర్శింపుడు. అతని కవితాశక్తి యెంతటిది? అతడు సృష్టించిన లోకమేది? దాని సౌందర్యఘనత లెట్టివి? అతడు మూర్తులుగ తీర్చిన వ్యక్తులెవరు? వారి జీవనరహస్యముల భేదించి వారి మానుషామానుషస్వరూపముల యెంతమట్టుకు మన కన్నులకు కట్టించినాడు. అతని భావములు, బోధనలు, ధర్మతత్వములు యెట్టివి? అవి యెంతవరకు సర్వసమ్మతములై యున్నవి? ఉత్సాహజనకములైనవి? ఎంత దూరము మన మతనితో కలిసి పయనింతుము? ఎచట వేఱుపడుదుము? అతని కావ్యనిరూపణక్రమమేది? ఆకారమేది? ఆత్మయేది? రీతియేది? శైలియేది? కన్నడపు బిగియేమి? సొబగేమి? ఇంపేమి? సొంపేమి? రన్నని నిలబెట్టి ప్రశ్నింపుడు. పరీక్షింపుడు. సాహిత్యకళాప్రియులు ఆత్మతృప్తికై తాలుచెఱిగి ధాన్యము నింపికొనుడు.

## రన్నడు :

ఇతడు అజితపురాణమును, సాహసభీమసేనవిజయమును, రన్నకంద మను నిఘంటువును రచించెను. అజితపురాణము చివరనున్న

‘ కరమెశెదుదు రత్నత్రయ
పరికల్పదె పరిశురామచరితమ్ చక్రే
శ్వరచరిత మజితతీర్థం
కరచరితం రత్ననిందె భువనత్రయదొళ్ ’

అను పద్యమువలన నితడు పరశురామచరిత్ర, చక్రేశ్వరచరిత్ర అను మరి రెండు గ్రంథములను గూడ వ్రాసినట్లు తెలియును. సాహసభీమసేనవిజయమునందలి "గంగమండలచక్రేశ్వరకటకోత్తమనాయక విరచనెయి ననర్ఘ్యరత్నమాదం రత్నమ్" అను వాక్యమును గమనించిన యితని చక్రేశ్వరచరితము గంగరాజసేనానాయకుడును, తనపోషకుడును అయిన చాముండరాయని గురించిన గ్రంథమని తోచుచున్నది. పరశురామచరిత, చక్రేశ్వరచరితములు మనకు లభ్యములు కాలేదు.

ఈ కవిని గురించి యితని గ్రంథములనుండి క్రింది విషయములు తెలియు చున్నవి. ఈతడు జైనకవి. బెడుగరునాడు నందలి బెళగళికి చెందిన జంఖండి లోని ముధోళ్ గ్రామమునందు సౌమ్యసంవత్సరమున (క్రీ. శ. 949) జన్మించెను. గాజులసెట్టి కులమునకు చెందినవాడు. ఇతని తల్లి అబ్బలమ్మ. తండ్రి జినవల్లభేంద్రుడు. సోదరులు దృఢబాహువు, రేచన, మారయ్య అనువారలు. బిడ్డ అత్తిమమ్మ. ఇతని గురువు అజితసేనాచార్యుడు. ప్రభువు చాముండరాయడు. ఈతనికి తైలపుడు (క్రీ. శ. 923–997) కవిచక్రవర్తి బిరుదము నొసగెను. ఇతడు ఆరంభమున సామంతులకడ, దండనాథులకడ నుండి తరువాత సత్యాశ్రయ సార్వభౌముని ఆశ్రయములో అభ్యుదయపరంపరలు పొందెను. సువర్ణదండ — ఛత్ర చామర — గజాది లాంఛనముల బడసెను. అజితపురాణమును శా. శ. 915 (క్రీ. శ. 993) విజయసంవత్సరమున రచియించెను.

ఇతనికి కవిరత్న, అభినవచక్రవర్తి, కవిగజాంకుశ, ఉభయకవి అను బిరుదములు కలవు.

> "కవిముఖచంద్రం కవిచ
> క్రవర్తి కవిరాజశేఖరం కవిరాజం
> కవిజనచూడారత్నం
> కవితిలకం కవిచతుర్ముఖం కవిరత్నం"

అను పద్యమునందు ఇతని బిరుదము లన్నియు పేర్కొనబడియున్నవి. తనకు పూర్వులగు కవులలో పంపని, పొన్నని పొగడి వారితో తన్ను కలిపికొని యిట్లు వ్రాసికొన్నాడు. "పంపనినుండి వాగ్విభవోన్నతి నెగడెను. అతని గుణములలో నెనగియున్న పొన్ననికి తనకు సమానులు కలరా! కవులలో కవితాగుణార్ణవుడు

(పంపడు), కవిరత్నము (రన్నడు) యిద్దరే పుణ్యాత్ములు. వీరిద్దరే కృతార్థులు" అని. ఆదిపురాణమును రచించి పంపడు ద్విజవంశధ్వజ మైనాడు. అజితపురాణ మును రచించి రన్నడు వైశ్యకులధ్వజ మైనాడు. పంప, పొన్న కవులు రట్టరాజ్య మున ప్రఖ్యాతులు కాగా ఉభయకవి రన్నడు చాళుక్యమహామండలమండనుడై నాడు. (పంప – పొన్న – రన్న కవులను రత్నత్రయ మందురు.)

## పంప, రన్నలు :

రన్నడు 'గదాయుద్ధము' ను సౌధమును పంప భారతమునందలి పదుమూడవ ఆశ్వాసమను పునాదిపై నిర్మించెనని చెప్పుటకు ప్రబలాధారము లున్నవి. వ్యాస భారత కథకును, పంప భారత కథకును చాల వ్యత్యాసము లున్నవి. అట్లు భేద మున్న చోట్ల రన్నడు పంపని మార్గమునే త్రొక్కెను. గదాయుద్ధ కథాభాగము స్వల్పము. అందులోని ముక్కాలుభాగము మహాభారతమున లేనే లేదు గదా యుద్ధమున గానవచ్చు హృదయవిద్రావకములైన విలాపములకును, స్వారస్యములైన సన్నివేశములకును, సూచనలు పంప భారతమునందలి పదమూడవ ఆశ్వాసము నందే కానవచ్చును.

ఇందలి రసవత్తరములైన అనేక ఘట్టములకు పంపడు కారణమైనను, ఇందు రన్నని కరకౌశలమే విశేషము. ఒకడు సంపాదించి పెట్టిన వస్తువు విలువను గ్రహించి దానిని సదుపయోగము చేసికొని అభివృద్ధి నొందించికొనుట కును సామర్థ్యము కావలయును. రన్నడు పంపకవి ననుసరించెనని అందరు అంగీకరింపవలసినదే. ఇందువలన నేమిహాని? పంపనినుండి రన్నడు గ్రహి హించి యుండవచ్చు నన్న అంశ యెంతయని లెక్కవేసినచో సుమారు పదమూడు, పదునైదు పద్యములు, అయిదు వచనఖండములకంటె యెక్కువ ఉండజాలదు. వచనములు గాక సుమారు 575 పద్యములున్న గదాయుద్ధములో ఇత దనుకరిం చిన భాగ మెంత స్వల్పమో సహృదయులు గ్రహింపక పోరు. అల్పమగు యీ అనుకరణభాగము మీదనే రన్నని కీర్తిస్తంభము నిలిచి నట్లగునా? ఈ భాగమును తీసివేసిన గదాయుద్ధము తన సహజసౌందర్యముచే రాణింపదా? పూర్వకవి భావాను కరణదోషమునకు రన్నడే కాదు సకలభాషాకవులును పాల్పడియున్నారు.

## గదాయుద్ధనాయకుడు :

గదాయుద్ధకావ్యమునందు దుర్యోధనుని చరిత్ర యెట్లు తీర్చబడినదో భీమసేనుని చరిత్ర ఆస్థాయిలో తీర్చబడలేదు. భీముడు యుక్తాయుక్తవివేకశూన్యుడై సాహసమునకు గడంగు ఆవేశమూర్తిగ మాత్రమే మనకు తోచును. అతని ఉదాత్త గుణములను చిత్రించుటకు కవికి తగిన సందర్భములే లభింపలేదు. దుర్యోధనుని చరిత్రను కవి చాల సుందరముగ చిత్రించినాడు. ఉదాత్తమానవోచితములైన అతని గుణములకు నివాళుల నిచ్చినాడు. చివరకు జయలక్ష్మి భీమసేనుని గళమున పుష్పదామమును వైచినను, దుర్యోధనుని ఉదాత్తతను మన కట్టెదుట నిలిపి అతడు పరాజితుడు కాకుండిన బాగుండెడిదని, ఓడినను నేల దొరలుచు పగవానిచే తన్నులు తిని ప్రాణములు వదలు దుర్దశ రాకుండ వలసినదని అనిపించునట్లు మన సానుభూతిని కవి దుర్యోధనునివైపు మరల్చును ఈ కావ్యమునందు భీముడు మొదటినుండి చివరివరకు మనకు ధీరోద్ధతుడుగ మాత్రమే కానవచ్చును కాని దుర్యోధనుడు అటనట ధీరోద్ధతావధులు దాటి ధీరోదాత్తుడుగ గనపడును.

మొత్తముమీద కావ్యలక్షణము, సంవిధానరీతి, వ్యక్తిప్రాధాన్యము, రసపోషకత్వములనుబట్టి కౌరవుడే పైచేయిగా నున్నాడు. భీమసేనుడు మనదృష్టిలో నల్పకాలమే యుండును. ప్రస్తావనారూపమైన ద్రౌపదీభీమసేనుల సంవాదము, దుర్యోధనుని వెదకుచు గాంధారీధృతరాష్ట్రుల ప్రవేశము, ప్రతిజ్ఞానిర్వహణోత్సుకతను వ్యక్త మొనరించు వీరాలాపములు, వైశంపాయనసరోవరసముఖమున దుర్యోధనుని తిరస్కారము, గదాయుద్ధము యీ సందర్భములందు మాత్రమే భీముని మనము దర్శింతుము.

దుర్యోధనుడు మొదటినుండి చివరవరకు మన లక్ష్యమునందుండి వ్యక్తివైశిష్ట్యముచే మన సానుభూతిని సంపాదించికొనును. అతని ఉదాత్తతను దర్శించిన మనము సింహావలోకనముగ ప్రస్తావింపబడిన అతని దురాగతములను విస్మరించెదము. దుర్యోధనుడు మడిసిన పిదప వేణీసంహారము, భీమకృత ద్రౌపదీసౌందర్యవర్ణనము, ద్రౌపదీభీమసేనుల పట్టాభిషేకము, పాండవుల అభ్యుదయములు కొనసాగినవి. కాని మనము వానిలో చేరము. దుర్యోధనుని ఊరుభంగ, మకుటభంగములచే దుఃఖతప్తులమైన మనము భీమసేనుని పట్టాభిషేకము నెట్లు చూడ

గలము. తొడలు విఱిచి మకుటమును తన్నిన భీముడు క్రోధాగ్ని కురిపించుచు, అవహేళనగ దుర్యోధనుని దుర్గతిని ద్రౌపదికి చూపించునపుడు తాలిమి కట్టలు తెగి దుఃఖము మేరమీఱి బలరాముడు ద్వారవతికి పోయినట్లే మనమును యెచటికో వెడలిపోయెదము. ముంచేమి జరుగునో తెలిసికొను కుతూహలముగూడ ఉండదు.

## గదాయుద్ధము – విషాదాంతనాటకము :

మహాభారతమున లేని కొన్ని ఘట్టములు రన్నని కావ్యమున కానవచ్చును. వానిలో ముఖ్యము లేవి యనగా దుర్యోధనుడు తన అపజయమునకు ఖిన్నుడై ద్రోణాశ్వత్థామలను దూషించుట, సంజయుడు వారి కర్తవ్యపాలనమును కొనియాడి భీమార్జునుల పరాక్రమమును ప్రశంసించుట, దుర్యోధనుడు కృష్ణభీమాదులను నిందించుట, గాంధారీధృతరాష్ట్రులు యుద్ధభూమికి వచ్చి పాండవులతో సంధి చేసి కొమ్మని బోధించుట, దుర్యోధనుడు యుద్ధభూమిలో ద్రోణ, అభిమన్యు, లక్ష్మణ, దుశ్శాసన, కర్ణాదుల మృతదేహములను చూచి ప్రలాపించుట, భీష్మునికడకు పోయి అతని హితవచనమును తిరస్కరించుట, బలరాముడు వచ్చువఱకు వైశం పాయన సరోవరమున దాగియుండుటకు అంగీకరించుట, అశ్వత్థామ లక్ష్మిని దూషించుట, చివరకు భీముని పట్టాభిషేక మగుట యివి మహాభారతమునందు లేని ఘట్టములు

రన్న డీఘట్టములను మనోజ్ఞముగ నిర్వహించినాడు. ఈ మార్పుల వలన గదాయుద్ధకావ్య దుర్యోధనుడు షేక్స్పియర్ మహాకవి వ్రాసిన విషాదాంతనాటకముల నాయకుని కొంతవఱకు పోలుచున్నాడు. నాటకకర్తలలో అగ్రగణ్యుడైన షేక్స్పి యర్ మహాకవి రచించిన విషాదాంతముల సంవిధానమును పోలునట్టి కథాసంవిధాన మును ఎన్నో శతాబ్దములకు ముందే రన్నమహాకవి కూర్చినాడని చెప్పవచ్చును.

గదాయుద్ధము చంపూకావ్యమైనను దుఃఖాంతమైన మహానాటక మనదగి యున్నది. అందలి చివరి దృశ్యమే దుర్యోధనుని మహిమాంచితమరణము. ఈ కవి కులశిరోమణి మనల దేశకాలాతీతులను గావించి కాల్పనికరాజ్య స్వప్నమార్గమున వైశంపాయనసరోవరతీరమునకు తరలించుకొని పోయి నిల్పును. కన్నులు దెఱచి చూచిన శతాబ్దాలనాటి నీలాకాశము, శతాబ్దాలనాటి పవిత్రతమ రమణీయవాతావర

ణము, వనావృతబంధురకమలాకరము, పశ్చిమగగనాంగణమున మునుగుచున్న రవి దుఃఖసూచకమైనను, కాంతిమంతములైన పంజకెంజాయలను వెదజల్లుచున్నాడు. ద్వాపరయుగములోని శాంతిపూరిత సంధ్యాకాలము, సామాన్యముగ సాయంసమయము మౌనవ్రతావలంబియైనను, వైశంపాయనసరోవరతీరమున ఎన్నడు, ఎచ్చటను లేని నిరతిశయ నీరవత. ఇదేమి! సరస్తటమున కోమల వల్లీవృక్షములు విఱిగి పడియున్నవి. కారుదున్నలు పోరాడె ననుటకు వీలులేదు. ఎందును గెట్టెల గుర్తులు కానరావు. తీరమునందలి పచ్చికపరుపు త్రొక్కుడులకు లోనై వాడువాఱి యున్నది. చూపఱి వెంటనే మానవుల పాదచిహ్నములను, పచ్చికను ఎరుపు చేయు రక్తమును చూచి చకితు డగును. ఇతడెవరు? తీరమునం దొకచోట ఊరుభంగ, కిరీటభంగముల పాలై నేలబడి కొనయూపిరి పీల్చుచున్నాడు. అతడే కౌరవమహానుభావుడు. అతడే కురుకులచక్రవర్తి కవిపుంగవు డగు ఆర్యరన్నడు మనల కొంతముందటికి గొని పోయి యుండిన కురునృపాలుని దుర్గతి మనకు విస్మయజనకము కాకుండెడిది.

దైవసంకల్పమును మీరువారెవరు? వైశంపాయనహ్రదమున కురుకుల స్వామి దాగియున్న సంగతి బైటపడి పోయినది. ఏ భీముని వెదకుచు మొదట తానే వెళ్ళియుండెనో ఆ భీముడు బైట నిలచి సీత్కారము చేయుచుండ గురుపవన నిర్బంధముచే లోననుండి క్రోధావేశపూర్ణు డగుచున్నాడు. సహనము మేఱ మీరినది అభిమానధనుడగు దుర్యోధనుడు మొఱటు భీముని తిరస్కారములను సహించి లోన నొదిగి యుండునా? క్షాత్రతేజోమూర్తి యుద్ధభీరునివలె మడుగున నిల్చుట తగునా? గురువాక్యపాలనకై మడుగు జొచ్చినను, క్షాత్రధర్మపాలనకై మడుగు వెడలెను పంపమహాకవి యీసందర్భమున చెప్పినట్లు "కరికలభగర్జనకు లేచిన మృగరాజువలె రాజరాజు నైరింపక చిత్తస్థలనముచే జలస్తంభన మంత్రము మాయమంత్రము కాగా, గదాదండమును భుజాదండమున సవరించి లజ్జాకరస్థితిని వదలి వెలికి వచ్చెను." గదాయుద్ధ మనివార్య మైనది. దైవసంకల్ప మీడేరినది. ఇచటి సన్నివేశమంతయు దురంతచ్ఛాయచే కృష్ణవర్ణము దాల్చెను. ఈ కృష్ణవర్ణచ్ఛాయలో దుర్యోధను డొక్కడే శౌర్యతేజఃపుంజమై ప్రకాశించుచుండెను. ధర్మదేవత అధర్మనీలాచ్ఛాదనమును కప్పుకొని అధర్మదేవత ప్రక్కన చేరియుండెను. రాజ్యలక్ష్మి దుర్యోధనుని అంతఃపుర బహిర్ద్వార దేహళిపై నిలచి

చంచలదృక్కులతో రణభూమిని చూచుచున్నది. ఈ పరిసరమందు చలింపక పరమేశ్వరుని పంచముఖములవలె పంచపాండవులు నిలచియున్నారు. ఎదుట అనుజశతమును కోల్పోయి రౌద్రావేశముతో నిండి అందరిని యుద్ధమున కాహ్వానించుచున్న సాహసమల్లుడు, ఏకాంగవీరుడు దుర్యోధనుడు. ఆసమయమున జంగమహిమాచలమువలె యెంతో నిరీక్షించిన బలరాముడు వచ్చెను. ఇప్పుడైన దైవబలమునకు తిరస్కారము జరుగునా? అని మన నిరీక్ష. దుర్యోధనుని నమస్కారము, బలరాముని ఆశీర్వాదము. చివరకు చావుకు జంకక రోషదుఃఖములచే నిండి శౌర్యమూర్తియై దుర్యోధనుడు నిలిచియుండుట యివన్నియు ఒకదాని కొకటి సహాయకములై దురంతపరిణామముల పరాకాష్ఠదశను ప్రదర్శించును. మానవుడు నిస్సహాయుడు. ఎవరున్నను ఏమియు చేయునట్లు లేదు.

## శైలి :

రన్నని శైలి వీర్యవంతమగు శైలి. అంతటి శక్తివి మరొకశైలిలో దర్శింప నెంచినచో మనము పరసాహిత్యములకు ప్రయాణము కట్టవలెను. మన కవు లొకరిద్దరిలో శబ్దాడంబరము యథేచ్ఛగా లభించును. కాని శబ్దాడంబరము శక్తి కాదు. శక్తికి కారణభూతమైన వాగ్వైభవము ఒక రన్ననికే యొనగూడినది. ఇతర కవులు ఇంపు, మాధుర్యము, సౌకుమార్యము, లఘుధాటి మొదలైన గుణము లను శ్లాఘాపాత్రములుగ ప్రదర్శించియున్నారు. ఆ గుణములు రన్ననికి ఆవశ్యక ములు కావు. దుర్యోధనుని దర్పము — దుర్యోధనుచలము — దుర్యోధనప్రతాపము అట్లే భీమకోపము — భీమప్రతిజ్ఞ — భీమసేనాడంబరము వీనికి సమన్వయమగు శైలికి లాలిత్యపు ఊసేల? "స్థిరబద్ధమచ్చరర్ — భీకరబద్ధభ్రుకుటిఘటితర్ — అద్భుతర్ — అట్టాసురర్ — అధికకోపపాటలపరుషేక్షణర్." అతని పాత్రలు "గదగదెయ్యుం ఘట్టిసె పుట్టిద కెండ కిడిగళ్." యివియే పదములు. "కైనడు గదెగదెయుం తిరుపువ బెడంగు" వద పరణి "ముడుపం బెన్నం కొరళం నడు నెత్తియ నెత్తిపొయ్దు రొర్వర నొర్వర్" అన్నదే పదధాటి. ఈ శైలీసామర్థ్య మును వేఱు పదములచే వర్ణించుట అసాధ్యము.

రన్నని శైలి రూపకానుగుణ శైలి.

(క) అందు పదబాహుళ్యమునకు అవకాశమే లేదు. అభిప్రాయములకు సంగ్రహమై, బిగియై, సరియైన వాణి లభించినది.

(ఖ) ఆద్యంతము భాష సంభాషణారూపము నందున్నది. రన్నని పద్యము లను మార్పు లేకుండ నాటకమున నుపయోగించ వచ్చును. ఆవిధముగ నుపయో గించి పరీక్షించి యుండుట కన్నడభూమికి వేద్యము.

(గ) పాత్రల గుణావగుణములు, ధైర్య, దర్ప, శోక, చిత్తక్షోభాదులు వారు పలుకు మాటలచే, చేయు పనులచే, వ్యక్తము లగును కాని కవి వర్ణనలచే కాదు. ఇది రూపకప్రధాన లక్షణము.

(ఘ) నాటకమునకు క్రియయే జీవము. గదాయుద్ధము పేరునకు తగినట్లు క్రియచేతనే పరిపూర్ణ మగును.

(చ) రన్నడు గూఢవిషయమును గూడ మూర్తిమంతముగ చిత్రించును. అవ్యక్తవిషయ మాతనికి వరిపోదు. ఇదియు రూపకమునకు ముఖ్యధర్మము.

(ఛ) కాష్ఠము లోలోపలి రాచికొని మహాగ్నిని రేపునట్లు కవి పదములు రాగోద్రేకముచే నొండొంటి నొరసి రసపుష్టిని చేయును. ఈవిధమగు పద సంయోజనము రూపకమునకు సరియైనది.

# శ్రీ కవిరత్న-రన్న

రసికులలో చెన్న కవిజనులను రన్న
విశదవిజ్ఞాన సంపన్న!
వసుధేశ సభా కవిపండిత సంమాన్య
కుశలకవి రన్నా! ఓ ధన్యా!

సాహసభీముని సాహసవర్ణన
ఊహింపగ కన్నడసీమ
ఆహవమల్లుర మీరిన సాహసో
త్సాహవర్ణనే రన్నడు కాదే!

# ఒకటవ రంగము

(కృష్ణుడు, భీముడు, ద్రౌపది ప్రవేశింతురు)

కృష్ణుడు : కం॥ శ్రీరమణికి నెలవుగ తన
పేరురముఁ సల్పనెంచు విధమున సమర
ప్రారంభమునకు భీముడు
కౌరవకుల సర్వనాశకరుడు కడంగెఁ.

మ॥ కురుభూభృద్బలతూల కాలపవనుఁ, క్షోణీంద్రగంధేభ కే
సరి, దుశ్శాసనరక్తరక్తవదనుఁ, సత్రాణ్మహోరుక్షమా
ధరవజ్రుఁ, కురురాజరత్నమకుటోత్పాటాంఘ్రిసంఘట్టనం
గరునిఁ, నేను నుతించెదఁ రణయశఃకాముఁ ఘనుఁ భీమునిఁ.

ద్రౌపది : వర్ణింపుము ! వర్ణింపుము. వీర్యములేని కధలో వర్ణనయైన వలదా ?

కృష్ణ : వింటివా భీమా ! నొచ్చి పలుకుచున్నది చెల్లెలు.

భీమ : సహజము.

కం॥ కురురాజానుజ భీకర
కరములు తన నీలకబరికాభర మీడ్వఁ
పరిభవ మందిన కృష్ణకు
దారకొనవే కోప తాప దుస్సహబాధల్.

ధర్మపుత్రుడు వైరాగ్యపరుడు.

కం॥ ధాత్రిని మరి యీ పావక
పుత్రికనే గాదు జూదమున నోడుట ఆ
క్షత్రియతేజమునే యమ
పుత్రుం డానాడు శత్రువున కోడండే.

ఆయన తమ్ములము మేము.

కం॥ పరవశతం బడిపోయిరొ ?
పరార్జితప్రాణు లైరొ పాంచాలి నటుల్
పరిభవము సేయుచుండఁ
దరమే కన్గొంచుండ పవనతనయ నరులకుఁ.

కం॥ వినయమ్ము నెదుట విక్రమ
మును దలపము నరునిమాట పోనిమ్ము ననుఁ
ఘనమంత్రాక్షర ముగ్గుని
నొనరిచినది అన్న సూనృతోక్తియ సుమ్మీ.

ద్రౌపది : ప్రియము నాకీ పశ్చాత్తాపము. సాహసభీమా ! పత్యాశ్రయా !

చ॥ దనుజవిరోధియే సలుప తప్పునె సంధియు నీవు నేను చే
సిన సుకృతంబు లట్టి వవశిష్టసుయోధన మయ్యె నేన శాం
తనవకుసుప్రభుల్ పలుక ధర్మజు డిప్పుడు పంధి కొగ్గునో
యని మది సంశయించెడిని అర్పుము శంకను కౌరవాంతకా !

కం॥ ఖలదుశ్శాసనపక్ష
స్థలోత్పతత్కృష్ణరక్తజలమున కోపా
నలం మాటిపోవ నీవును
గళితోష్మద వట్టు లకట గన్పట్టెదవే.

కం॥ క్షమనూపి శత్రువులయెడ
యమసూనుడు సంధికొగ్గు డనెనేని అర
ణ్యమె మీకు శరణ్యం బ
గ్నిముఖోద్భవ నగుట నాకు నెరవౌ నదియే.

భీము : సుయోధనప్రళయకాళీ ! పాంచాలీ !

కం॥ జారిన కచభారముతో
ఊరిన కన్నీటితోడ నుత్తలపడుచున్
నారీ! నీ విటులుండగ
కౌరవనాశకుడు వీడు గళితాగ్రహుండే.

కం॥ కురునందనులను దునిమితి
కురుపాంసను ననుజు నల్ల గ్రోలితి రెంటన్
జరితార్థుడ నీ తక్కిన
మరి రెంటిని దీర్చి పగను మాపగలేనే.

కం॥ ఊరుల విఱిచెద తన్నెద
కౌరవపతి మకుట మురలగా వేణీసం
హార మొనర్చెద నీగతి
భారము తీర్చెదను నాదు పరిభవమునకున్.

కం॥ మన ధర్మజు డడుగును శాం
తనవుడు గావించు సంధి తప్ప దను వగన్
ఐనియేమి? అన్నమాట
ట్లునుచుము తాతయె కడంగ నొప్పరికింపన్.

ద్రౌపది : చం॥ ఇఱివబెడంగదేవ పరమేశ్వర సాహసభీమ ఆజి ని
న్నాఱు బెదిరించుచున్ బ్రతుక నోర్తురె నీదు భుజాగదాహతిన్
పఱియలు వారి క్రుళ్ళిన శవాలయి భూతగణాళివిందులై
తఱిగిన గొట్టె లైన రిపుతండమె పల్కు భవత్ప్రతాపమున్.

కం॥ ఒడలును తొడవులు రెండున్
చెడునట్టివి చెడని సొమ్ము చిరయశ మొండే
చెడు నొడలు తొడవు లిడి మరి
చెడని మహాధనము గొనగ చింతింపగదే.

కం॥ మణిఖచిత స్వర్ణవిభూ
షణములకే వలతురొకొ్కా చానలు శస్త్ర
వ్రణముల నీవలె పురుషులు
గుణములు మెరయించి పేర్మి గొంద్రటిభీమా!

కృష్ణ: లెన్నగ మూదలించితివి ఇంక ధృతరాష్ట్రు డెక్కడ? గాంగేయు డెక్కడ? సంధికార్య మెక్కడ? దుశ్శాసనాదుల నొక్కడు దక్క నూర్వుర నతిఘోరముగ నుఱుమాడెను. శేషించిన ఆదుర్యోధను నొక్కని గెల్చుటో, గూల్చుటో మనదొర కేమిగిహనము ఆహా! రౌద్రావతారిణీ! దేవాసురయుద్ధమునకు కరగల మెత్తిన డామరడాకినీ!

కం॥ కురుకులమును గ్రమింగితి వికఁ
మరి కొందఱ గ్రమింగ నుంటి మహిపరిలోడఁ
మరియొక హిడింబిరక్కసి
మరలఁ నిన్నెచట తెచ్చె మనవిభు డౌరా:

భీము: ఈమె నా ఆరాధ్యమహాశక్తి. ప్రియా!

కం॥ నే ననిలనందనుడ నై
శ్వానరసుత వీవు మనము జతగూడిన ఇ
చ్చో నెట్లు సంధియగు నన
లానిలయోగమున భగ్గు మనదే పగయుఁ.

కం॥ కురుకులజీవాకర్షణ
పరిణత మిది కాలహస్తపాశము యగు నీ
శ్వరి కేశహస్త మగునే
పరాభవజ్వలనకృష్ణపటలము కృష్ణా!

కృష్ణ: భీమసేనా! ఎఱుగుదువుకదా! దుర్యోధనునకు మైత్రేయు డొసగిన శాపమును. నేను భానుడుండగా పగతుని పరిమార్చుకున్న ఇంకెన్నడును దునుమలేవు. రేపు బలరాముడు వచ్చి కలియ నున్నాడు.

భీము : కృష్ణా : చింతింపకుము.

కం॥ సత్యప్రతిజ్ఞుఁ డన కురు
సత్యాదకిరీటభంగ పరిబద్ధయశః
స్తుత్య కృతార్థత బడయక
సత్యాశ్రయ బిరుదు నాకు సార్థకమగునే.

రమ్మా యాజ్ఞసేని : నీ కార్యము తీరినది.

(నిష్క్రమణము)

# రెండవ రంగము

(దుర్యోధనుడు, సంజయుడు)

దుర్యో: సంజయా! నాదుఃఖము హృదయమే యెఱుగును

మ॥ అరిసైన్యంబు నొకండె దున్మనని రుద్రాంశుం డటంచున్ వెతల్
నరుడున్ త్ర్యంబకుడంచు సాకితిని తానో తండ్రియో పూన్కిమై
శరసంధానము చేతురంచు నిటు శస్త్రత్యాగమున్ చేతురే?
అరయం జాలరె సేవ్యసేవకత నౌరా ద్రోణుడున్ ద్రౌణియున్!

కం॥ ఈయగ చంపగ రక్షణ
సేయగ క్షత్రియులె మఱి భుజించెడి తఱి నో
హో యన నాపదలం ద
య్యో యనగా గాక చంపనోపుదురె ద్విజుల్!

కం॥ కరవాలము నఱికినయటు
మరవాలము నరుకగలదె మహి వీరవరున్
ధరియించిన తోడ్పడు నుప
కరించునే పంద పతికి కదనమువేళన్.

సంజ: (ఆత్మగతము) ఇంకను గురుదూషణమా! మఱెందుకో.

కం॥ కార్యసఖుండంట శకుని
శౌర్యసఖుండంట సూతజాతుడు భీష్మా
చార్యుల నుడి తప్పట దు
ష్కార్యం డహికేతనునకు కర్మవశమునన్.

(ప్రకాశముగ) కురురాజా! గురువుల శరాసారము నీవే చూచితివి.

కం॥ కలశనదీజులు భక్తికి
కలశం బిడినట్లు పోరు గావించిరి వా
రల శక్తి మీరె నెవ్వరి
కలవియగుఁ గ్రీడిశౌర్య మరయవె నీవుఁ.

కం॥ బకునిఁ, హిడింబునిఁ, కీ
చకునిఁ, కిమ్మీరదనుజు సమయించెను పూ
వికఁ జీల్చె జరాసంధుని
సకలదము పవనసుతుడు సామాన్యుండే!

కం॥ పవనేంద్రజులు గదాగాం
డివము ల్గొన నెదిరి ప్రతిఘటించెడి వీరల్
భువనముల కలిగిరే పాం
డవభుజవిక్రమము నూతనంబె నృపాలా?

వీరుండనిమ్ము. భరతకులశిరశ్శేఖరుడు ధర్మపుత్రుడు తన ధర్మబలమున ఉన్నచోట గెలువడే?

కం॥ దానము ప్రియవాక్సహితము
జ్ఞాన మగర్వంబు శౌర్యసహితక్షమయుఁ
కానము భువి సమకూడెను
దానజ్ఞానక్షమాళి ధర్మజునందుఁ.

దుర్యో: ఉండుము ఉండుము సంజయా.

మ॥ స్థిరమై సత్యము ధర్మముఁ దయయు సుశ్రీ పొల్చువాడీ యుధి
ష్ఠిరు డంచెల్లరు బల్కఁ కీర్తి నశియించెఁ కార్ముకాచార్యునిఁ
గురునిఁ బ్రాహ్మణు కల్లలాడి శిరముం గోయించునాడే మృషల్
పరమాఘంబనరే పృథానుతుడు పాపాత్ముండు గా కన్యుడే?

చం॥ అనుజుడు కొప్పు బట్టి సభ కంగన నీడ్చిననాడు వీరుడ
య్యెనొ? భగదత్తు నేఁగు కుడియె మ్మగలించిననాడు వీరుడ
య్యెనొ? ఇనజుండు చంప కదలించి వదల్చిననాడు వీరుడ
య్యెనొ? కురుబాలురం దునుము నింతకె మారుతి వీరు డయ్యెనే?

మ॥ పెనుజూదంబున సోదరుల్ వనితయుం బెంపేదగా భృత్యుడై
వనిలో వల్కలధారియై, తపసియై భర్గుణ్ మహాస్త్రంబు గో
రె నటుండై మతి పేడియై విరటు నారీలోకముం గొల్చె కృ
ష్ణుని బంధుం డత డద్దిరా! త్రిజగతీశూరుండె కౌంతేయుడున్?

మ॥ సభలో నా యనుజుండు తాము గన పాంచాలిన్ మహోపంచవ
ల్లభనుం బట్టగ రెప్పలార్పని కనుల్గా జూచు శౌర్యాఢ్యు లి
ప్డు భళీ యందురె? ఈపరాక్రమము నాటోపంబు నీవీర్య మీ
సుభటాలాపము లెల్ల వారి కపుడెచ్చో శూన్యమై పోయెనో?

విడువుము, చాలింపుము. ఆనిర్భాగ్యుల నేమని యందము?

మ॥ గురునిన్ ప్రోజ్ఝితచాపు గైతవమునం గూల్పించు నైపుణ్యమున్
శరశయ్యాగతు జేసి తాత నొగిలించన్నేర్పు రాధేయునిన్
విరథజ్యాయుధునైన చంపగల దోర్వీర్యంబు కౌంతేయు లొ
క్కరె నేర్వంగలవారు సాహసధనుల్ కౌరవ్యులు న్నేర్తురే?

ప్రొద్దుపోవుచున్నది, నడువుము. భీముని చూపుము.

సంజ: రాజరాజ! స్వామిహితము పల్కుదును క్షమింపుము. ఈ మూర్ఖత్వము వలదు. పాండవులు అనుకూలదైవులు నీకు దైవము ప్రతికూలము కదా!

దుర్యో: మూర్ఖసంజయా!

కం॥ సమరజయము దైవాయ
త్తమగున్ సమరంబు శూరధర్మము కాదే?
యమనందనాదుల నొ
క్కమొగంబున నోర్చి చలము కడముట్టింతున్.

మ॥ సురసింధూద్భవ, కుంభజన్మ, దినకృత్పూన్వాదులన్ గూల సం
గరమం బెట్లు జయించు? పాండవుల నీ కౌరవ్యు డేకాకి యం
చెఱుగం జాలని లోకమేమనినగానీ ఈ గదాదండ ము
ద్ధుర దోర్దండయుగంబె చాలు రణమందున్ తోడు కాంక్షింతునే?

సంజ: అభిమానధనా! ఫలదంకమల్ల! ఏరిని నిరాకరింపవు? శ్రీకృష్ణుడా మహావిష్ణువు

కం॥ పవనసుతుండు మహారథు
డవనిప సమరథుడవీ వనాలోచిత మా
పవనజుతో నని విడు ఐ
ద్ధవైరమున్ సంధి సేత తగినది నీకున్.

దుర్యో: కృష్ణుండట! ధీయుండట! దేవుండట, భూతంబట!

మ॥ పురుషుల్మొప్పుర నొక్కడందు రసురవ్యూహమ్ము డంద్రాజిగ
ద్గురుడంద్రన్యులకేల తేరు నడుపున్? కుంతీతనూజాతకిం
కరు డేలయ్యె? భయార్తుడయ్యె పలుకంగా నొప్పు సూతుండు కిం
కరుడుం కాతరుడంచు నొప్పునొకో నా కంసారి దైవంబనన్?

కం॥ వసకున్ మత్స్యాదికముల్
మునుపయ్యె దశావతారములు చాలవె అ
ర్జును తేరుదోలు పదునొం
డనదగు సూతావతారమా ఇది హరికిన్?

అతని అంతర్యమడిగెదవా చెప్పెదను.

కం॥ అనుజను పార్థున కిడి యా
తని సుతునను బిడ్డనిచ్చి తనియక కౌంతే
యుని తేరు నడిపి తానా
తని పేరున నేలజూచు ధర్మజు నవనిన్.

పి భీము డొక్కఁడు.

కం॥ ఘనబలయుతు నను సమరథు
డనియు నతిరథునిగ మఱి మహారథుగా భీ
ముని బల్కితివిగదా ఆ
తని రథచక్రంబు లంత దళసరిగిరులో?

కం॥ పరులం బొగడెదు నన్నుఁ
బరకుంగొన వల్పుజేసి సంజయ నీవుఁ
మఱియొక ద్రోణాచార్యుడు
మఱియొక భీష్ముండుగాగ మది దలచెదవో?

సంజ: (ఆత్మగతము)

కం॥ ఎంతెంత దిద్దవొడగిన
నంతంతగ నైజ మధికమయ్యెడు నీ భూ
కాంతుని యందున కటుగా
శ్రాంతశ్మాన్యాచ్ఛవంశ మట్టిది కాదే?

(ప్రకాశముగ) ఫణిరాజకేతనా! యుద్ధమునే నీవు కోరునెడ అశ్వత్థామ కలడు, బలరాముడు కలడు. వారిలో నొకరికి సేనాపత్యాభిషేకము చేసి వైరుల సాధింపుము.

దుర్యో:

కం॥ మినువాక పట్టిచే తీ
రని కర్జము పిదప నా కలశజునిచే తీ
రని కర్జ మినజుచే తీ
రని కర్జము ద్రౌణిచే దిరంబుగ నగునే?

కం॥ ద్రోణుడు చేసిన మేలే
ద్రోణజుడుంగూడ జేయదొడరెడు సమర
క్షోణిం దదాశ తీయుఁ
బ్రాణము విషముష్టి చిగురు, పండొక పెకదా?

కం॥ హలినిఁ రణకేళికుతూ
హలినిఁ నమ్మితి నతండు నాహవకోలా
హలమందు తీర్థయాత్రా
చ్ఛలమున తన జనులతోడ చని రాకుండెఁ.

కం॥ మడిసెదు రిపు లర్కజుచే
మడియుదు రట్లు శూరుడైన మా తమ్మునిచే
మడియుదు రట్లే నాచే
మడియుదురేగాక ఒరుల మగటిమి నగునే?

కం॥ కానీన ద్రోణ నదీ
సూన సమిన్మరణజాత శోకోద్గత బా
ష్పానీకములను నేనే
సేనాపత్యాభిషేకసిద్ధిని గందుఁ.

అయ్యో! సంజయా! సంజయా!

కం॥ నా కిరువురు నిరు భుజములు
నా కిర్వురు రెండు కనులు నా యువరాజుఁ
నా కర్ణుడు లేనపుడిక
నాకేటికి బ్రతుకు రణమె నను గడతేర్చుఁ.

కం॥ మడిసెను దినకరతనయుడు
మడిసెను దుశ్శాసనుండు మా తమ్ముండుఁ
గడిదేరు వీరు లుభయులు
మడియగ దుర్యోధనుంపు మనుటయుగలదే?

కం॥ మనసిటు శూన్యము నాకుఁ
మనవీడుఁ శూన్య మాటమహియుఁ సకలా
వని శూన్య మయ్యె దుశ్శా
సనకర్ణులు లేక బ్రతుకు సాగించెదనే?

(తెరలో)

సేవకుడు : ఇటు, ఇటు మహారాజా !

సంజ : హా ! కష్టము, కష్టము ! కుమార సుయోధనా, సహింపుము, సహింపుము వృద్ధమాతాపితరులు వెదకుచు నీయున్న యెడకు వచ్చిరి. వారి చరణారవిందవందన మ్మాచరించి మహారాజు హృదయక్షత మాడునట్లు పలుకుము

దుర్యో :

కం॥ బాంధవుల గూల్చి సరసిజ
బాంధవ తనయానుజాళి బలిగొని వేసి
అంధనరేంద్రుని మొగముఁ
గాంధారి మొగంబు నేమొగంబున గాంతుఁ ?

మ॥ అరిభూపాలుర నుక్కడంచి జయతూర్యధ్వానముల్ నిండ సో
దరులం బుత్రుల మిత్రులం గలిసి మోదంబొప్ప దర్శించు పం
బర మిట్లయ్యె విధాత ! మద్గురుల సంతప్తాత్ములఁ శోకత
ప్తులఁ బాష్పజలాభిషిక్త తనులఁ దర్శింపగా జేసితే !

కం॥ అన్నా ! నీ సోదరు లెం
దున్నారని జనని యడుగ నొగి యేమందుఁ ?
చిన్నారి తమ్ములను బలి
గొన్నా రల పార్థులంచు కుమిలించెదనే ?

హా ! దుశ్శాసనా ! హా కర్ణా ! (మూర్ఛపోవును)

సేవకుడు : ఇటు, ఇటు మహారాజా !

ధృత : కం॥ ఒడయడు పదియునొకండై
పొడవగు నక్షౌహిణులకు భూమిపతులు వెం
బడి గొల్వ గొల్వులో వెలి
గొడుగుల దగు నిన్ను వెదకికొనుచే తనయా !

సేవ : తల్లీ! కార్యము చెడినది. ఇదిగో! మహారాజు పాదములు కౌగలించి కొని సంజయుడు విలపించుచున్నాడు.

ధృత : కం॥ హా! కురుకులచూడామణి!
హా! కురుకులచక్రవర్తి! హా! సకలధరి
త్రీకాంత! నిన్ను విధి పర
లోకంబున కనిపెనే ఖలుడు కోపమునన్.

గాంధారి : కం॥ మృగధరకుల సంపల్లత
నెగడగ నెవ రెవరు? నీవె నిలిచితి ప్రాపై
తగిలి లయకాల భీమో
రగ మురగపతాక! నిన్ను గ్రసియించెనొకో!

ఆ॥ వె॥ మాకు సంధయష్టి మాడ్కి నుంటి వాకండ
వున్నచాలు నంద రున్నయట్లె
అట్టి నిన్ను కౌరవానిమిత్తరిపుండు
యముడు చంపె సార మరసె నేమొ!

కం॥ గురుచరణంబుల కెరగక
పరమాశీస్తతిని ప్రీతి బడయక మౌనం
బు రహిం బూనుట ఉచితమె
గురువినయము మరతు వాక్కొ కురుకులతిలకా!

కం॥ మడిసిన దుశ్శాసనుడే
సుతులనెనో చిన్నికొడుకు నొచ్చినయెడ యే
సుడులనె దుష్కర్ణుం డే
నుడులనెనో మాకు దెలుప నోచవె పుత్రా!

సంజ : తల్లీ! విలపింపకుము కర్ణదుశ్శాసనాదుల చావుతో శోకోద్వేగము నొంది మూర్ఛ నందినాడు; ఇప్పుడే లేచును.

దుర్యో : (లేచి) నమస్కరించుచున్నాడు నిర్భాగ్యుడు.

గాంధా : నాయనా ! బ్రతికియున్నావా ?

ధ్రుత : మహాదృష్టము. వీక్రూరవిధి శాంతించుగాక !

సంజ : అందుకు తగిన శాంతి గూర్పవలె పెద్దలు.

ధ్రుత : వత్సా ! సుయోధనా ! యుద్ధప్రవృత్తిని మానుము.

కం॥ శ్రీవనితకు నిజవిజయ
శ్రీవనితయె సవతిగాగ రిపునృపులన్ శౌ
ర్యావిష్కృతి బోరిగొనెడు జ
యావసథ మసాధ్య డాజి ననిలాత్మజుడున్.

ధర్మపుత్రుడో ఇంకను ప్రేమాస్పదుడై యున్నాడు.

చం॥ యమజుడు మేలు సేయు మన కన్న ! ఒడంబడు మింక సంధికిన్
సమకురజేయ నంపెదను సంజయు భీమునితోడ గొన్న ద్వే
షము విడు మాత్మజానుజవిషాదము నైచు మొసంగు మర్ధరా
జ్యము మనవారి కన్న ! నిను నంధపితన్ వద మంటి వేడెదన్.

గాంధారి : కం॥ పరిణతకాయుల మంధుల
మిరువురమున్ మమ్ము దన్పుటే యుచితంబౌ
గురువాక్యంబున కొడబడు
గురువచన మలంఘ్య మంద్రడు కురువంశనిధీ.

కం॥ సమరవ్యాపారము మా
నుము సుత ! నీ శిబిరమునకు నొవ్వక చనుమా
సమసిన పుత్రులు సమసిరి
మము గావగ చాలుదీవ మఱి వచ్చెదరే ?

ధ్రుత : కం॥ వీరశతజనని కీ గాం
ధారికి దుఃఖశతజనని నామం బిచ్చెన్
కౌరవపతి దుఃఖమహా
భారవహాయాసమునకు పాలగు కతనన్.

ఈమె నోదార్చుట నీ ధర్మము చలమున నేమగును? నీ తమ్ములగతి జూచి, తమ తమ్ముల దలచి ధర్మజుడు సంధి గోరుచున్నాడు. నీ వంగీక రించుటే తడవు సంధి జరుగగలదు.

సంజ : యుక్తమిది నీ తండ్రిమాటలు పాటింపుము.

దుర్యో : మీ పూర్వపక్షమే మాకు సిద్ధాంతము.

మ॥ తన తోబుట్టిన తమ్ములం దొకడు యుద్ధక్షేత్రమం దీల్గినన్
తన ప్రాణంబుల నగ్ని కిత్తునని ఆ ధర్మాత్మజుం డాడడే
ఘనులౌ నూర్వురు నా సహోదరులు ద్రుగ్గ న్నేను జీవింతు వం
చను మిథ్యాశలు వీడు డెల్లరకు నేదై పోయె నాకౌ నదే.

కం॥ సాధింతు క్రీడినుండియు
సాధించెద భీము జీల్చి సంగ్రున హా! క
ర్ణా! దుశ్శాసన! తీసెద
సాధింతు నదోషి యమజు సహాజీవనమున్.

గీ॥ తమకు నేనె సుతుండనె? ధర్మరాజు
సుతుడు గాడొకొ, మీరును నతడు గూడి
పొరపులే లేక సుఖముగా పూర్వమట్లు
బ్రతుకు డిక నన్ను దయచేసి వదలరయ్య!

ధృత : నీవు మాత్రము మామాటలు గైకొనక వైరమునే పూని పాండవుల సాధింప నున్నావు. సంధి కొడంబడకున్నను నీవు మా కింతైన మేలు చేయుము. ఇకపై జరువడగు కార్యమును నీ తాతతో నాలోచించి జరుపుము. ఇదొక్కటి చేయుము.

దుర్యో : మహాప్రసాదము.

# మూడవ రంగము

(పిశాచములు — సంజయుడు — దుర్యోధనుడు)

సంజ : భయంకరము, రణరంగము. అదిగో !

కం॥ శవభక్షక తండంబులు
శవములకై తిరుగుచుండె సమరావనిలో
నవకాశ మీక తమపతి
శవరక్షణ సేయు సుభట సంఘము లిచటన్.

ఇటు చూడుము.

గీ॥ ఇంత లింతలు జేసి ఈ యేన్గు శవము
నంతయును తామె అపుడప్పు డారగింప
దలచి పెఱికిక, తినక నాకలి దపించి
సంచరించెడి బుద్ధిపిశాచగణము.

దుర్యో : ఇదేమి ? ఈ పిశాచములు మనచుట్టు మూగుచున్నవి.

1 వ పిశాచి : అక్కా ! దుర్యోధనుడు !

2 వ పిశాచి : నిలు నిలు ద్రౌపదీద్రోహీ ! నిలు !

3 వ పిశాచి : నీకై ఆకలితో నున్నాము.

1 వ పిశాచి : గురువి నెత్తుర గ్రోలుదు మన్న అతడు బ్రాహ్మణుడు.

2 వ పిశాచి : నీ తమ్ముని నెత్తురు ద్రాగుదుమన్న భీముడు పీల్చెను.

3 వ పిశాచి : భీష్ముని వేడినెత్తురు పీల్చుదుమన్న ఇంకను చావలేదు.

1 వ పిశాచి : కురురాజా ! నీ నెత్తురు చవిజూచుటకు నోరూరుచున్నది.

2 వ పిశాచి : ఊరుభంగ మగును ఉండుము.

సంజ : కర్ణకఠోర మీ పిశాచవాక్యము.

దుర్యో : ఛీ! పిశాచిమాటలు సత్యము కాదు.

2 వ పిశాచి :

చం॥ అమరిచి లక్కయింటను విషాన్నమునన్ దునుమాద నెంచి వై
రము నిటు బెంచి భీము సమరస్థలికిన్ గొనితెచ్చు నీవు ద
య్యమవా? పిశాచకోటులు రణావని గొల్వ చరించు నేను భూ
తమునొకొ చూత మిర్వురను దయ్యము లెవ్వరొ నాగకేతనా!

దుర్యో : సంజయా! ముందుకు, ముందుకు.

2 వ పిశాచి : పలుకకుండ పోనీయను.

1 వ పిశాచి : పోయినచో ద్రౌపదియాన.

3 వ పిశాచి : మీరిపోయిన వీరభీముని యాన.

1 వ పిశాచి : సంజవరకె నీయాట.

(దుర్యోధనుడు గదను ధట్టించును; పిశాచములు పాఱిపోవును)

సంజ : మహాసత్వా! ఈ దయ్యములతో నేమి? విజయము చేయుము. అక్కటా!

చం॥ వినుతవిరోధిమాండలిక వేష్టనమార్జిత పాదపీఠ కాం
చన కమలాయమానములు స్వామిపదంబులు భిండివాల నూ
తన కరవాలఖండములు తండములై పడియున్న సంగరా
వనితలమందు మోపి నడువన్ పరమేష్ఠి ఘటింపజేసెనే!

దుర్యో : సంజయా! కన్నీరు దుడిచికొనుము.

కం॥ తనుజానుజుల వియోగమె
మనమును నొప్పించదయ్యె మఱి యీ సమరా
వని లోహఖండములు బా
ధను గూర్చునె? వజ్రకఠినతరచిత్తునకున్

నడువుము. నా ధైర్యమును కలంచకుము.

సంజ : వీరెవరు? ఆచార్యులా?

దుర్యో : ఆచార్యా! కోపమున దూషించితిని.

చం॥ అరయమె చాపనైపుణిని ఆ నరుడేమి? పినాకపాణి యే
త్తెర నిను దాకి గెల్వగలడే యనిలో నిది నీయుపేక్షయో?
ఒరసిన మాదు కర్మఫలమో అరయన్ మఱి నీకు మృత్యువే
తెఱగున సంభవించె? గురుదేవ! మహారథ! కుంభసంభవా!

సంజ : ఇదిగో అభిమన్యుడు.

దుర్యో : కం॥ అసమబల! భవద్విక్రమ
మసంభవము పెరకు నిన్ను నర్థించెద మా
కౌనగుము కుమార! నీ సా
హసైకదేశాత్త మరణ మాహవమందున్.

(చేతులు మోడ్చును)

సంజ : మహారాజా, ఇటురాకుము, ఇటురాకుము

దుర్యో : చూచితిని, లక్ష్మణకుమారుడుకదా? వత్సా!

కం॥ జనకునకు జలాంజలినిన్
తనుజాతుం డొసగు టొప్పు తప్పిన దది నే
డొనగూడె నీకు నేనిడ
తనయా! విధి నేత క్రమము దప్పించెగదే!

సంజయా, దుఃఖములో దుఃఖము, చూపింపుము దుశ్శాసనుదెక్కడ ? కర్ణు డెక్కడ ?

సంజ : ఇదిగో, అనుగుదమ్ముడు.

దుర్యో :

మ॥ అసువు ల్వేరొక లోకమందువ పిశాచాస్యంబునన్ మాంసముల్
వెసర క్తం బరికుక్షిలో తల సురద్విట్పాణిలో చారుగా
త్రసుమంబుల్ కురుభూమిలో నిలిపి గాంధారీజ ! దుర్యోధనా
ప్త ! సహోదర్యుడ ! భీము భీమగదచే పంచత్వముల్ బొందితే ?

మ॥ జననీ స్తన్య మొకండె కాదు మఖదీక్షాసోమముల్ దివ్యభో
జనము ల్గొన్నవు దేను ముం దవల వత్సా ! నీవుగా నుంటిమే,
వినయోల్లంఘన చేయమే మరణ మీవే ముందు గై కొంటివే ?
అనిలో వెన్కయి నిల్చికోనయితి వత్సా అగ్రజత్వార్థ తన్.

గీ॥ భ్రాతృర క్తంబు గ్రోలిన వాని నల్ల
జీవనహితంబుగా బీల్చి చేవమిగిలి
రహి సుయోధన నామ పార్థక్య మెసగ
కడగి తమ్ముని కసిదీర్ప గలనె నేను.

ఈ తెగిన కళేబరమును చూడజాలను, నడువుము

సంజ : (ఆత్మగతము) ప్రియసఖుడు, కర్ణుడు రాజరాజునకు సమస్తదుఃఖము నినుమడింప జేయును.

దుర్యో : హా కర్ణా !

కం॥ నీవును, నేనును, తమ్ముడు
మూవురె దిట్టల మతండు పోయిన పిదపన్
నీవు న్నే నుంటిమి ఇపు
డీవున్ నను వీడి చనితివే అంగపతీ !

కం॥ నీ వృషసేనుడు మఱియుఁ
నావాడగు లక్ష్మణుడు రణంబున చావఁ
నీ వోదార్పఁగవలె నను
నీవగపు న్దీర్పనుంటి నే నంగపతీ

కం॥ అరయం జ్వాలను నీయీ
తెఱగు న్నాకేల ? మొగము త్రిప్పితొ అధవా
మఱుమాటాడవు రవిసుత
మఱచితివో నన్ను బడలి మ్రాన్పడినావో ?

గీ॥ చెలిమికాని సుయోధను చేరి చూడ
వేమనవు కౌగిలింప విం కేల దుఃఖ
మనవు మర్యాద చూపి "దేవా, నరేంద్ర"
అనవు బదులాడ వేలయ్య అంగరాజ ?

గీ॥ నీవు గల దేశమున నిల్వనేర్చునేమి ?
అనృతభయలోభములు కర్ణ ! త్యాగసత్య
శౌర్యగుణములు రాజిల్లు సజ్జనముల
నగ్రగణ్యుండవై యుంటి వంగరాజ !

కం॥ నే నెఱుగుదు పృథ యెఱుగును
దానవరిపు డెఱుగు పద్మదయితుం డెఱుగుఁ
జ్ఞాని సహదేవు డెఱుగును
నీ నిజమును పరు లెఱుంగనేరరు కర్ణా !

కం॥ తన తోబుట్టని యెఱిగిన
ఇను జేయడె నిన్ను నప్పుడే ధర్మజుడుఁ
నిను రాజు జేయలేనై
తిని నా యొడయనిగ దలచితిని అంగపతీ !

కం॥ నీవున్న నుండు రాజ్యము
నీవుండిన పట్టముండు నెగడును ఛత్రం
బీవున్న నుండు పీఠం
బీవుండక ఉండ దేదియే నంగపతీ!

కం॥ కనులందును, హృదయంబున
కనబడు నీరూపు నాకు కర్ణంబులలో
వినిపించు నీదు వాక్యము
దిననందన నీవియోగ మెక్కడిదయ్యా!

కం॥ విను జంపిన పార్థుండును
అనుజుని దునుమాడినట్టి అనిలజు డేనుఁ
మనియుంటి మిప్పటికి భవ
దనురాగాస్మత్కృతజ్ఞతాంతర మిదియే.

కం॥ ఇనజుని దుస్థితి దుశ్శా
సను దుర్గతి జూచి ఇంక చన వసువులు నె
ట్టన నాకు ఱాతిగుండియ
తనమున నెన్నాళ్లు బ్రతుకు దాల్పగ వలెనో.

కం॥ సూనులు పోయిరి ప్రియమి
త్రానుజులున్ పోయి రోవిధాతా! ఇంతే
హీనస్థితి గనజేతువా?
ఈ నీచుని పాపకర్మ నీ నిర్భాగ్యుఁ.

అయ్యో! సంజయా!

గీ॥ ఎవరితో ప్రీతి బలుకుదు నింక నెవరి
గూడి కొలువుందు నెవ్వరితోడి విందు
లారగింతును నాయన్న లేరు లేక
ఎటుల భద్రాశ్వగజముల నెక్కువాడ?

చం॥ చెలి కసు మోహమయ్యె మణి చేకుర దశ్రువి మోహమున్ ధరా
తల మతడిచ్చె నేను తిలతర్పణ మింక నొసంగ నన్యమం
డలముల శౌర్యవహ్ని దహనం బొనరింపగ నీత డీతవిన్
జ్వలితము కాష్ఠవహ్ని నిడజాలన కర్ణున కేమొనర్చితిన్ !

సంజ : దేవా ! కర్ణువింక మ్మరువుడు.

కం॥ తరుణులు పలవించునటుల్
పురుషులు విలపించుచుంట పోలునె ఘనమే ?
మఱి కార్య మెవరు దీర్తురు
కురుభూషణ పగను దీర్చు గుఱి మఱచెదవే ?

దుర్యో : కం॥ దరహాసితముఖుడు సురకుం
జరగమనుడు మేరుశైలసమతేజుడు భా
స్కరసుతుని రూపు నిలిచెను
విరచితచిత్ర మటు చిత్తభిత్తికయందున్.

మ॥ అగు దీక్షావిధులందు సద్గురుడు మంత్రాంగంబునన్ మంత్రియా
జగతీరక్షకు స్వామి నర్మసఖు డిష్టక్రీడలందెల్ల నే
న్నగు భారంబున కాడి యొద్ద పటుశూరాగ్రేసరుండున్ సదా
నగవు ల్జిల్కెడు మిత్రు కర్ణు మఱవ న్నాకుం దరం బౌనొకో !

సంజ : రాజరాజా ! శరశయ్యపై భీష్ము డిచట నున్నాడు. విజయము చేయుము.

దుర్యో : కురుపితామహా ! బాలుడు నమస్కరించుచున్నాడు.

సంజ : (చెవిలో) పితామహా, ఏ మనుమడు, కురుకులాంబరద్యుమణి దుర్యోధ నుడు విచ్చేసినాడు.

భీష్ముడు :

చం॥ ధవళగజేంద్ర చామర వితానకముల్ ధవళాతపత్రముల్
ధవళవిలోచనా శతశతంబులు గొల్వ దిశాంతరంబులన్

ధవళిత కీర్తిగేయ నినదంబులు పర్వగ నేగుదెంచు కౌ
రవధవళుండు నార్తి గదురన్ పరదేశిగ నేగుదెంచెనే!

ఏకాకివై వచ్చిన నీ రాకతో సమరవృత్తాంత మంతయు నవగతమయ్యెను.

దుర్యో : తాతా, నన్ను గూర్చి దుఃఖింపకుము.

చ॥ వినయము వీడి మీరు గురువృద్ధులు పల్కు హితోపదేశముల్
మనమున లేశముంచ కిటు మారుతిపై చలమూని ఇంద్రనం
దను వమయింప వైరమును దాల్చి కడంగితి విట్టి పాపక
ర్మని కతనం ఘటించె విడుము ల్కాదు మీకిటు సింధునందనా.

భీష్ముడు : కుమారా, కావలసిన దైనది. వృథా సంతాపము వలదు. ఇక నా మాటలు వినుము. పాండవుల నొడబరచి, సంధికుదిర్చి పూర్వక్రమము జరుగునట్లు చేయుదును. వారు నేను చెప్పునట్లు విందురు. నీవును నామాట విని బ్రతుక వేడెదను.

దుర్యో : కం॥ మిము గాంచి జోతలిడిపో
సమకట్టియె వచ్చినారి సంధి పరులతో
సమకూర్పగోరి రా నిక
సమరహితం బేదొ తెలుపు చయ్యన తాతా.

కం॥ వసుధకై కాదు పోరుట
కసికై పాండవులతోడ కలహించెద నీ
కసుమాలపు టిల కర్జుని
కసిమసగెను దీని నేను కాంక్షించెదనే?

కం॥ నా దైదూతలు వారలు
వేడిన నీకుంద నేడు నే నగబాలున్
వేడి మనదూత నంపిన
కాడింపరె పవనసుతుడు గర్జింపడొకో!

మ॥ ఇకనౌనే ? వహాజీవనం బరులతో నీసంధి చేకూడునే
ఆకటా ! నీవు, గురుండు లేక చెలియౌ నాకర్ణుడు న్లేక మా
మకసోదర్యులు లేక నేరికయి ఈ క్ష్మామండలం బేలుదుఁ ?
సుకము ల్సంపద లేరితో గుడిచెదఁ శోభావిహీనంబుగా.

క్షమించుడు. నా దుఃఖము చల్లారదు. అఖండితమయిన అభిమాన మొక్కటే మిగిలినది. దానినే బలివెట్టెదను.

భీష్ముడు : సంజయా, పొమ్ము గాంధారీధృతరాష్ట్రులతో నిట్లు చెప్పుము. మనుమడు నాపల్కుల కొదంబడడు. ఆతని సత్వము, ఏకాంగసాహసము ఆశ్చర్యకరములు. మానధనుడగు నాతని మనము బాధించుట తగదు అని. కుమారా ధైర్యము వహింపుము. తీర్థయాత్రల నుండి బలరాముడు రేపు రానున్నాడు. ఈ యొకదినమే మైత్రేయశాపమున నీకు గల గండము. ఇందుకు కాలవంచనమే మంత్రము. వైశంపాయన సరోవరమును జొచ్చి, ఈరాత్రి గడపి రేపు నీయదృష్టము చూచికొమ్ము పొమ్ము.

దుర్యో : మహాప్రసాదము (పోవుచు)

కం॥ బలియురు పాండవు లవ్వా
రలతో యుద్ధంబు సల్పరా దిక సంధిఁ
పలుపుట మేలను పెద్దల
పలుకులు విన కర్ణములను బ్రహ్మ యొసగెనే !

కాసారములో కాలవంచనమా !

కం॥ దినకరతనయుని దుశ్శా
సనుని వియోగమున కింత సంకటమును బొం
దను శిరము ముంచి జలమం
దునికికి విలపింతు తాతఉపదేశమునఁ !

కానిమ్ము. భీమునితో సంధి కాకుండుగాక.

# నాలుగవ రంగము

(కిరాతకులు వెదకుచు పోదురు. భీముడు, ధర్మరాజు, కృష్ణుడు ప్రవేశింతురు)

భీముడు : ఎచ్చట అడంగె నా ద్రౌపదీద్రోహి?

మ॥ పదరై పోయెను పూన్కి యెల్ల సభలో పాంచాలరాజాత్మజా
వదనమ్లానత మాన్పలే దికను మద్బాహూత్థ కండూతి తీ
రదు కొంచెం బెపుడీ సుయోధనహతుల్ ప్రాణంబులం దీయగ
ల్గదు నంచుల్ మది యుత్తలంబడెడు మూర్ఖుం డాత డెందుండెనో?

కం॥ రస జొరబారెనొ? నాలుగు
దెసలం దేమూలనే నొదిగెనో ఖలుడీ
వసుమతిలో విధిచాలక
వెస జొచ్చెనొ తల్లికడుపు వెరవున మరలన్.

కం॥ చర మచర మనెడు జగదం
తరమున ఖలు డెందు దూరినన్ తద్భుజపం
జరమున నున్నను హరిహర
పరమేష్ఠుల నెదిరి వాని బట్టి వధింతున్.

మ॥ చతురంతక్షితికాంత! ఓజలధి! ఓసప్తార్చి! ఓతంద్రి మా
రుత! ఆకాశమ! వీనులార విను డాద్రోహాత్ము కోపాగ్ని కా
హుతి జేతున్ దనుమాడ లేనియెడ నత్యుగ్రాగ్నికిన్ నేనెయా
హుతి నౌదున్ కురువంశ నాశకుడ భీమోద్దాముడన్ పల్కెదన్.

ధర్మరాజు : భీమా! ఈ కోపోద్రేకము తగదు.

భీముడు : ఓహో ధర్మశ్రవణము!

చ॥ కులపతి ముక్తకేశయయి ఘోరవిషాదము నంద గాంచుచుగా
చలనముఁ బొంద మేను ననుజన్ములు నీవు దయావిదూరతగా
కలతను జెంద వింత యపకార మొనర్చిన వైరిభూజముగా
నిలువున గూల్చి దుఃఖముల నీగెద మింక సహింప శక్యమే !

కం॥ ఈనా దొకందు నేనుగా
గాను విధేయుండ మీరు కా రగ్రజు లు
ర్వీనాథ ! విడువు దీకురు
సూనుని బడజీల్చి చంపి సూడుం దీర్తుగా.

గీ॥ ముంగురులు బట్టి యీడ్చి నాముందె ద్రుపద
పుత్రిని పరాభవించిన ముష్కరుండు
భీతిచే నెందు దూరిన విడుతు నొక్కొ !
కురుపతిని చంపకయె నేను దిఱుగగలనె ?

కృష్ణుడు : భీమా ! మాటలచే కార్యముకాదు. సూర్యుడు వాలుచున్నాడు. ముం దరయుదము రమ్ము.

భీము : ఓహో సైనికులారా ! కురుక్షేత్రములో కురుపతిని వెదకవలసి వచ్చెను. ఆహాహా ! !

మ॥ ధృతరాష్ట్రాత్మజు శక్రసూతిసఖు దాదిక్కామినీనాథుడుగా
కృతకద్యూతజితార్జునానిలజు దాశిష్టార్యవాక్యుండు సం
హృతకృష్ణాంబరకేశు దాత్మజమహాహృత్తాపసంతప్త దు
ద్ధతుఁ దేమూల నడంగె మీ కురుకులోద్యద్రాజ దేవేంద్రుఁడుగా ?

కం॥ భరతకులేందుకళంకుఁడు
భరతాన్వయరాజభవన వాయస పముడుగా
కురుకేతు డెందు గల దా
కురుకులలయకేతు భీమకులమణి వచ్చెగా.

(తెరలో)

కిరాతులు : అడుగులు, అడుగులు!

భీముడు : ఎక్కడ? అడుగులెక్కడ? (పోదురు)

# అయిదవ రంగము

**భీముడు :** ఎచ్చట ? ఎచ్చట అడుగులు ?

**కిరాతకులు :** ఈ కొలనుగట్టుమీద.

**భీముడు :** వానివే! వెలువడిన అడుగులు.

**కృష్ణుడు :** ఇది ఆకపటి తంత్రము. భీష్ముని కాలహరణమంత్రము. లోన నుండును. కొలను ముట్టడించి వెలువరింతము.

(కిరాతులు వాద్యములు మ్రోయింతురు)

**ధర్మరాజు :** భరతాన్వయమున కిది లజ్జాకరము.

**కృష్ణ :** ధర్మప్రియా! రాజ్యలక్ష్మి అసహ్యముతో వదలినట్టివాడు.

గీ॥ గోవులను బట్టె, ద్రౌపది కురుల నీడ్చె,
గొప్పలను బల్కె, భీతిచే కొలను దూరె,
పరుల బాధించు నీతని పాడుపనులె
చాటు కౌరవ రాజ్యావసాన కథను.

**ధర్మ :** కం॥ అంకితుఁడు బలిమి కురుహరి
బాంకుఁడు దుర్యోధనాంకుఁ డనబడి అయశః
పంకమున నీ సరోవర
పంకంబున దాగియుంట భావ్యం బగునే ?

**కృష్ణుడు :** కం॥ మానధనుండవు నీ వలి
మానక్షతి జేతువే? క్షమానాథ యిటుల్
ఈ నీట ఎండ్రి యుండును,
మీనంబులు, కప్పలుండు, మేల్మగ లుండ్రే?

భీము : ఈ భూతము నాకంఠధ్వని మంత్రమున గాని బయల్పడదు.

కం॥ భవదనుజు రక్తజలమును
చవి జూచితి నీ సమస్తసైన్యమహోర్ధిన్
చవి జూచితి నీ మదువున్
చవిదీరగఁ జీల్చి నీదు చవియుం జూతున్.

కం॥ స్వరము వినలేక నాయు
గ్రరూప మది తేరిచూడరాకను సమరా
కరమును వీడుచు కమలా
కరమును జొరబారి బ్రతుకగా నెంచితివో ?

చం॥ జలమున మీనమట్లు జలజాకరమందున జొచ్చినాడ వా
చలి నిను బాధపెట్టు పెలుచన్ భవదీయ సుయోధనత్వమే
బొలువఱు చచ్చువారు మఱి పుట్టరె ? ఛీ ! గదగొమ్ము కౌరవా
చలభిదురుండ భీముడను శత్రుబలోన్మథనుండ వచ్చితిన్.

మ॥ హరిసంధానమునాడు జూపిన మహాహంకార మయ్యగ్నిజాం
బరకేశగ్రహణంబు సల్పు మద మప్పార్థాదులన్ పెద్ద మ
చ్చరముం బూని వనాళి ద్రిప్పు కుటిలోత్సాహంబు నేమయ్యెనో ?
కురువంశాధిప ! నేను భీముడ రణాకుంఠోద్ధతిం బల్కెదన్.

దుర్యో : (లేచి) ఏడీ భీముడు ?

భీముడు : కం॥ అనుజన్ము రక్తజలమున్
మును ద్రావగ వెలిచి ఇందు మున్గిన నీవెం
టనె వచ్చిన యావీరుఁడు
ఘనశౌర్యుఁడు భీముఁడితఁడు కౌరవనాథా !

దుర్యో : పాంచాలీపరాభవదినమున ఈ గండుఁగర్వ మెందుండెనో ? షండా !

గీ॥ నాడు సీమలు వాసి బన్నములు బడుచు
కందమూలాళి భుజియించి కాననముల
నడగి యుంటిరి నే డవియన్ని మఱచి
బిరుదుమగలట్లు మెఱయుచు దిరుగ దగునె ?

గరిటెను, కాడను వదలి గదను ధరించి యుద్ధమొనర్చుట సాధ్యమా ?

కం॥ ఎసరిడి బియ్యము వార్చుట
వెస కంచము తోలచుటయును, వేగించుటయున్
పసియగు వంటలవానికి
వ్యసనం బిది ఎవఁడు నీకుఁ బట్టించెనొకో !

భీము : కం॥ వరసోదరసూనృత మా
దరమున విఱపంగ వంటదాసుడ నైతిన్
కురువంశజ విను మిక నీ
శరీర మాంసమును వండి శక్తుల కిడుదున్.

ధర్మరాజు : భీమా ! పగచే మున్ను సల్పిన అధర్మమును స్మరింపక నిర్మల క్షత్రధర్మమును స్మరింపుము. సుయోధనా !

గీ॥ సంగరం బేల ? సద్గుణశాలి వగుము
భవ్యసంపన్మహా భోగ భాగి వగుము
ఇష్టు నీవేల భూమియు, నెల్ల భూమి
భాగములు లేక కొని సుఖం బడగదయ్య !

మ॥ ధరణిన్ సర్వము గొమ్ము పోవిడువుమా దాయత్వమున్ మమ్ము నే
వుర దాసుల్వలె నేలికొమ్ము గతమున్ పోఁద్రోయు మన్నింట సు
స్థిరతం బొందుము సాధుమార్గమున శాంతిన్ గీర్తి సాధించి సో
దరు డెట్ల ట్లువశాంతి గొమ్ము కురునాథా ! రాజచూడామణీ !

కృష్ణుడు : దుర్యోధనా ! ధర్మజుఁడు కృపచే హితమునే బల్కెను. ఇప్పుడైన విని బ్రతుకుము.

దుర్యో : కం॥ కానట ! మధ్యస్థుఁడు మా
కౌనట సహాజీవనంబు ! హరిహరి మఱి సం
ధానమట ! సంధిమాటల
నానాడే త్రెంచియుంటి నది తప్పెటనే ?

భీమా ఇవేమి మాటలు ? రా, పోరుదము. చిరవాంఛిత మగు గదాయుద్ధము సాగింతము. చేయిగొట్టుము. (ద్వంద్వయుద్ధమగును)

దుర్యో : ఇది కళింగుని ద్రుంగిన దర్పమునకు.

భీము : ఇది లాక్షాగృహదహనమునకు.

దుర్యో : కురుబాలురను తిన్న రక్కసితనమునకు.

భీము : కృత్రిమవిషాన్నమునకు, మాయాజూదమునకు.

దుర్యో : దుశ్శాసను రక్తము ద్రావిన పిశాచమునకు

భీము : పాంచాలీప్రసంగమునకు.

దుర్యో : ఇది కర్ణునకు. (భీముడు క్రింద బడును)

కృష్ణు : భీముడు పడెను !

దుర్యో : ఇది ధర్మయుద్ధము. పడినవానిని కొట్టను. ఉండు. గదాయుధపు గాలిచే నెచ్చరిక గొలిపెదను.

భీము : (తెలివినొందుచు) పాంచాలీ, పాంచాలీ.

కృష్ణు : సత్యాశ్రయా ! ఊరుభంగప్రతిజ్ఞ ఏమైనది ?

దుర్యో : (తొడతట్టి) భంగమైనది !

(యుద్ధమగును. దుర్యోధనుఁడు పడును)

భీము : యాజ్ఞసేనీ ! కౌరవకులకాళరాత్రీ !

ద్రౌపదీ! రా! చూడు, రా! ఊరుభంగమును, కిరీటభంగమును. (తన్నును)

ధర్మరాజు: కూడదు, కూడదు. తమ్ముని, ఏకాదశాక్షౌహిణీపతియగు రాజాధిరాజును పరాభవింపకూడదు. అకటా!

కం॥ కడగి తొడవిరిచి నెట్టన
పడవైచిన నేలగరిచి పడియును వసుధన్
విడువ నమభంగి కులగిరి
పడినట్టుల విరిగి కౌరవప్రభుడు పడెన్.

(దుర్యోధనుని సమాధానపరచును)

భీము: చూడుము. కనులార చూడుము యాజ్ఞసేనీ!

మ॥ చలముంబూని, విషంబొసంగి మఱి లాక్షాగారముంగాల్చి భూ
తలముం జూదమునందు గెల్చి వలువల్ ధమ్మిల్ల మీడ్పించి దో
ర్బలమొప్పన్ పలుబాములం గుడుపు నా పాపాత్ము డాద్రోహి చం
చలు డానీచుడు క్రుంగినా డిచట నోచంద్రాస్య వీక్షింపుమా!

చం॥ ధరణిపు డిందు దీక్షితుఁడు తమ్ములు నల్వురు ఋత్విజుల్ రణా
ధ్వరవిధి యాజ్ఞికుం డల గదాధరు డాదృతసోమపీథినీ
చరితవు నీవు ప్రేరక మసహ్యపరాభవ మిందు కౌరవే
శ్వరు డిటు వేల్పెదన్ పశువుభంగి నమర్షమహాగ్ని నగ్నిజా.

కం॥ సుహుతుఁడు కౌరవ్యక్ర
వ్యహవ్యమున నాయమర్షపావకు డిక దు
ర్వ్యహదుర్యోధనదేహ
ప్రహరణరక్తమున నా కవభృథం బయ్యెన్.

పగదాయ మడిసెను, ముడివేసికొమ్ము.

ద్రౌపది: అలవాటు దప్పి మఱచితిని. పగతుని మడియించిన నీవే ముడివేయుము.

భీము : వేణీసంహారమైనది. చిరంజీవిని ద్రౌపది పూలు ముడిచికొన్నది. ఆహా శృంగారము ! విభ్రమము ! బెడంగు ! బింకము. ఇట్లుండవలదా నారీసౌందర్యము ఈమె దరహాసవీక్షణముల సమరశ్రమయెల్ల దీరెను.

గీ॥ పదియు రెండేండ్ల కష్టముల్ భంగపాట్లు
ఘోరసంతాపమును గూర్చి తీరినతఱి
పుటములను బెట్టి తీసిన పొన్నువోలె
కనుల మిరిమిట్లు గొలిపె నీ కాంత యౌర !

ప్రియా, రమ్ము విడిదికి.

(భీముడు, ద్రౌపది పోదురు)

ధర్మ : కృష్ణా, కృష్ణా ! విజయోన్మత్తులు వీరు కానలేరు. నేను చూచితిని. భీముని తలపై ఆడుచున్న ఘోరమూర్తులను ; భ్రాతృహత్యామహాపాతకము లవి. చిరంజీవిని రక్షింపుము, రక్షింపుము.

కృష్ణ : నీ ధర్మమే రక్షించును. రమ్ము అందఱము నీలాచలమునకు పోయి, మహాశివు నారాధించి వచ్చు బాధల నివారించికొందము. ఇప్పుడు కౌరవ లక్ష్మి మీదైవది. (పోదురు)

(లక్ష్మి దుర్యోధనుకడనుండి పోవుచుండును)

అశ్వత్థామ : భీష్ములు చెప్పిన కాల మిదే యగును. కౌరవేశ్వరునిగూడి పాండవుల ధ్వంస మొనర్తును. ఎవరీమె ? సరోవరలక్ష్మియా ? నీ వెవ్వరిదానవు ? ఎచ్చటినుండి వచ్చితివి ? ఎందుబోదువు ?

లక్ష్మి : చం॥ అమృతపయోధినిర్మథనమందు జనించితి నీరజాతగే
హముల వసింతు శౌరి యురమందు మెలంగు మహానుభావయౌ
కమలను నింతదాక కురుకాంతుని చెంగట నుంటి నిప్పు డు
త్తమపురుషోత్తమాజ్ఞలను దాలిచి పార్థుల చేర బోయెదన్.

అశ్వత్థామ : పార్థుల జేర బోదువో ? ఆ గోపాలునితో జేరి గోపికవైన మూఢురాలా :

గీ॥ పందయని వీరుఁడన్న వివక్ష లేక
పావనుఁడు, పాపియన్న వివక్ష లేక
తరుణుఁడని వృద్ధుడన్న భేదంబు లేక
నెయ్యమున గొల్చు నీకంటె నీచులుంద్రె ?

కం॥ చంపింతువు సుతజనకుల
చంపింతువు చలముతోడ సహజన్ములనుఁ
చంపింతువు గురుశిష్యుల
తెంపరి : నీకంటె గ్రూర దేవత లుంద్రే ?

పార్థుల జేర బోయెదవో ?

కం॥ ఛీ : మానుము ధర్మజుడట :
భీముండట, క్రీడి కవలు భీషణులట : సం
గ్రామమున వార అశ్వ
త్థామకు నాపోశనార్హత న్నిలుతురొకో :

కం॥ నీ మురరిపుబలమును మా
భూమీశుని బలము నోర్చి : పొడగందువురే
నీ మునుపటివతి కురుపతి
గీముఁ తరలించి పంప కృష్ణుండెవడే ?

తొత్తా : నడువుము కౌరవేశ్వరుని కడకు. (లాగును)

లక్ష్మి : కం॥ అచట నసురారి అనతి
ఇచటఁ రుద్రావతారుఁ డీగతిలాగుఁ
అచట పులి : ఇచట దరి : ఇం
కెచటికి నే నేగవలెనో ఎఱుగను కట్టా :

దుర్యో : (పలవరించును) మానభంగము, మానభంగము.

అశ్వ: కౌరవచక్రవర్తీ! ఇదేమి?

చం॥ తలపడి ఎవ్వఁడా భుజగదంష్ట్రిక లూడ్చె? మృగేంద్రముఁ బటా
వలిగొని కోరలఁ బెరికివైచె నెవండు? మదేభముఁ ధరా
స్థలి బడగొట్టి దంతముల జార్చె నెవం? డిక నీ సురాద్రివి
శ్రుతనిబిడోరు భేదనము సల్పిన దెవ్వఁడు నాగకేతనా?

కం॥ హా! కురువంశమహాకమ
లాకరకలహంస! హా! మహోర్వ్యంతధరి
త్రీకాంత! హా! ఫణీంద్రప
తాకా! ఇటులున్నె విధివిధానము నీకుఁ!

ఉత్తరీయముచే ఈతల ధూళి తుడిచెదను.

దుర్యో: అశ్వత్థామా!

కం॥ అరిచరణపాంసువుల నీ
పరిధానముచేత తుడిచివైవంగల నో
గురునందన నీవిటు నా
పరిభవపాంసువుల తొలచి వైవంగలవే?

అశ్వ: గీ॥ నన్ను వంచించి పచ్చి ఈ బన్నములకు
పాలుపడితివి కురుపతీ ప్రతియొనర్ప
గోరుదువె ఇంక? ఇదిగొ నా వీరముష్టి
నా మహోరక్తి, శక్తి ఎంతటివొ గనుము.

దుర్యో: కం॥ హతదేహుఁడ హతభుజుఁడఁ
హతోరుఁడ హతమకుటుఁడను హతమతి నాకుఁ
ప్రతికార మెందు గలదే?
గతిసాధన యొండె ఇంక కర్తవ్యంబో.

అశ్వ: చెప్పుము చేసెదను.

దుర్యో : భీముని తల తెచ్చెదవా? కన్నులార చూచి కొఱతలేక చచ్చెదను.

అశ్వ : ఇదేమి గహనము! ప్రభువునకు నాకడపటి సేవ. నేను వచ్చువరకు ప్రాణము నిలిపియుంచుము. ఓసీ! లక్ష్మీ! చక్రవర్తికి చామరము వేయు చుండుము. (పోవును)

లక్ష్మి : గీ॥ పట్టు కొనముట్టుదాకను పట్టె హఠము
హఠము విడువక తనపూన్కి నట్టె నేర్పు
మీర సాగించె, జంకడు మేనుబడిన
మాన ధితఁ డెంత ఆత్మాభిమానధనుఁడొ!

(అశ్వత్థామ ప్రవేశము)

అశ్వ : ఇదే కొనుము, నీ వాసించిన అయిదుగురు పాండవుల తలలు నీ కాలిపై నున్నవి.

దుర్యో : భీముదేడి?

చ॥ పవనజు మోముకా దతని వక్త్రము నన్గని మిన్నకుండునే
భువి బడియుండ? దురాగ్రహము బొందుచు బోతి వెఱ్ఱింగవైతి పాం
డవుల శిరంబులే యివి? కటా! ద్రుపదాత్మజ గర్భజోపపాం
డవ శిరముల్ విచేదవ యొనర్పక ఈగతి తెచ్చినాడవే?

కం॥ పరమేశ్వరావతారుఁడ!
పరమజ్ఞానీ! వివేకపతితుఁడవలె బా
లురతలలు నరికి తెత్తువె
దొరకొను శిశుహననఘోరదోషము నీకున్.

ఇదంతయు కృష్ణునిమాయ. హరి, హరీ పొమ్ము. దీనికి ప్రాయశ్చిత్తము చేసికొమ్ము. దైవముముందు మనమెంత? (చనిపోవును)

అశ్వ : నొచ్చిన జీవుడు చల్లబడెను. మహానుభావా! నీకు సుగతి యగుగాక! ఓసీ! విద్యున్మాలికాచంచలవగు రాజ్యలక్ష్మీ నీ వాధూర్తుల పాలగుము పొమ్ము. (లక్ష్మి పోవును)

తపోవనమే నాకిక శరణ్యము. అదిగో సూర్యుఁడు వాలుచున్నాడు.

చం॥ కమలములున్ సుహృద్వదనకంజములున్ ముడువంగ నుగ్రతే
జము సమయన్ కరంబులు నిజప్రభ బాయగ సర్వచక్రముల్
కుములగ నంబరంబు విడి శోణితలిం బడుచున్ తమస్సమూ
హము బలియన్ మహాసురకులార్కుఁడు నర్కుఁడు నస్తమించిరే!

(తెర)